# శ్రీరస్తు

శ్రీరుక్మిణీకళత్ర
సారసదళనేత్ర విమల సత్యచరిత్ర
నీరదగోపమగాత్ర
కారిమిత్రోఁ బ్రోవుమయ్యా ♦ గోపకుమారా. 1

శ్రీకరుఁడవనుచు భక్తవ
శీకరుఁడవటంచు శుక్ర ♦ శిష్యాళియెడన్
భీకరుఁడ వేనుచుఁగొలచెద
గోకులమణి భీమసింగి ♦ గోపకుమారా. 2

శ్రీగౌరీ శంకరులను
వాగీశ సరస్వతులను ♦ వారణముఖునిన్
యోగివరు శుకునిఁగొలచెద
గోగోపక యుతవిహార ♦ గోపకుమారా. 3

ఇన శశి కుజ బుధ గురు కవి
దినకరసుత రాహుకేతు ♦ ధీవరులను నే
ఘనముగమత్ప్రీతి నెగడఁగఁ
గొనియాడెద మానసమున ♦ గోపకుమారా. 4

సలలితముగ హృదయంబున
బలినారద వాలఖిల్య ♦ భక్తులనెల్లన్
బలుఁమరు వినుతించు మనే
గొలచెదనీ దాసులగుట ♦ గోపకుమారా. 5

ధారుణిమద్గురు నమలా
చారునిత్తోలేటి వంశ ♦ జలధివిధునిసీ
తారామకవి ప్రవరునిఁ
గోరిభజించెదను భక్తిఁ ♦ గోపకుమారా. 6

యతిగణ నియమంబెఱుఁగను
వితతపురాణాదులైన ♦ వీక్షింపగలే
దతిభక్తిఁ జెప్పఁబూనితిఁ
గుతుకముతోఁ గొనుముదీని ♦ గోపకుమారా. 7

తలఁచెద నినునిరతంబునుఁ
గొలచెదనీపాదయుగము ♦ గొబ్బుననాప్రపం
దలఁపుముదయతో ననుఁజి
ష్టులుఁబెట్టకు వేడుకొందు ♦ గోపకుమారా. 8

దినకరశత తేజా ! సుర
వినుతపదాంభోజ యుగళ! ♦ వినతాసుతవా
హన ! కృపతో నాకృతిఁగై
కొనుమా మ్రొక్కెదను నీకు ♦ గోపకుమారా. 9

నరహరినరసఖ గిరిధర
కరివరదమురారి కృష్ణ ♦ కంసధ్వంసీ
పురుహూతవినుత పదయుగ
కురుకులవనవీతి హోత్ర ♦ గోపకుమారా. 10

వినుమా నా విన్నపమున్
గనుమా కృపతోడ నన్నుఁ ♦ గడువడినోహో
యనుమా నేఁ బిలిచినఁ గై
కొనుమా నా వందనములు ♦ గోపకుమారా. 11

శ్రీధరనారాయణ హరి
మాధవవసుదేవ తనయ మధుదనుజహరా
సాధుజనావన శీలా
గోధనపరిపాల విజయ ♦ గోపకుమారా. 12

మందరధర ! సుందరశర
దిందము ఖా ! మురహారణ!సు ♦ రేశ్వరసుత ! సా
నందా ! గోవిందా ! ముచి
కుందవరద ! నంద తనయ! ♦ గోపకుమారా. 13

మాధవ కేశవ త్రిజగ
న్నాథాశ్రీ రుక్మిణీశ ♦ నాథానన్నా
రాధసంజేసెదం గోత్రివవె
గోత్రధరహితభక్త వినుత ♦ గోపకుమారా. 14

నాగాధిప సంరక్షా
నాగాధిప భోగతల్ప ♦ నాగారిహయా
నాగారి నిభవరాక్రమ
గోగణపరిపాల విమల ♦ గోపకుమారా. 15

యదుసద్వంశ పవిత్రా
మదరిపు దావాగ్ని హోత్ర ♦ మహితచరిత్రా
సదయత నాహృదయంబునం
గుదురుగ నివసింపు మెపుడు ♦ గోపకుమారా. 16

కంజదళాయతలోచన
కుంజర రిపుశౌర్యదైత్య ♦ కుంజరసింహా
కంజభవ వినుతపదయుగ
కుంజరపతి వరదకృష్ణ ♦ గోపకుమారా. 17

సేవించెదనిన్నెప్పుడు
నావిన్నపమువధరింపు ♦ నలినదళాక్షా
నీవేదిక్కనిసమ్మతి
గోవిందాజోతఫ్రమెపుడు ♦ గోపకుమారా. 18

వారకనీమృదుపాదాం
భోరుహములుసంతతంబుఁ ♦ బూజింతుమదిన్
కూరిమి నెల్లప్పుడునా
కోరికలొసగూర్పుమయ్య ♦ గోపకుమారా. 19

రారాయాదవకులమణి
రారావసుదేవ తనయ ♦ రక్షింపునగో
ద్ధారా శ్రితమందారా
గోరాజతురంగ మిత్రి ♦ గోపకుమారా. 20

దామోదర సంకర్షణ
వామన కేశవమురారి ♦ వసుదేవసుతా
కామారిముఖ్యనన్నుత
కోమలపదపద్మయుగళ ♦ గోపకుమారా. 21

వీక్షింతువుదాసులకృప
రక్షింతువుదీనజనుల ♦ రాజీవాక్షా
శిక్షింతువుదుర్మార్గులఁ
గుక్షిస్థితపద్మజాండ ♦ గోపకుమారా. 22

హరిహరియనివచియించిన
దురితములుండవని చెప్పు ♦ దురు పెద్దలు నే
నిరతమునిన్ను స్మరించెద
గురుతరకృపాంబోధివుమయ్యా ♦ గోపకుమారా. 23

సతతమునీపదయుగళము
హితమతినాహృదయమందు ♦ నిడుకొనిభక్తిన్
ధృతివాక్పుష్పములచేఁ
గుతుకంబునఁ బూజసేతు ♦ గోపకుమారా. 24

నారాయణనీనామముఁ
పారాయణఁ జేయునట్టి ♦ భక్తులనెల్లన్
వారకఁ బ్రోతువుసతతము
కూరిమినను గావరాదె ♦ గోపకుమారా. 25

మానులసురగలను నే చెడి
దానవులనుగూల్ప భువిని ♦ దశరథపృథ్వీ
జానికినుదయించితివట
గోనాగీరమణవినుత ♦ గోపకుమారా. 26

పుట్టితివిరవికులంబునఁ
బట్టితివిప్రతిజ్ఞమునులఁ బాలించుటకున్
గట్టితివి లవణవారధిఁ
గొట్టితివి సురారిచయమ్ము ♦ గోప[illegible]రా. 2[illegible]

[illegible] కురుకులజుల
ఖండనమునసమయఁజేసి ♦ పాండవసుతు భూ
మండలపతిఁజేసితి వహా!
కుండలపతిశయన శౌరి ♦ గోపకుమారా. 28

కురురాజ సభను ద్రౌపది
పరిభవమును బొందినన్నుఁ • బ్రార్థింపంగా
నరగునరక్షించితివట
కురుకులజులుపిఁగుపొంద • గోపకుమారా. 29

ఎంచెద నినుమనములోఁ బూ
జించెద నిరతముమదీయ • చిత్తంబున నో
కాంచన చేలా! ననుఁజే
కొంచుఁగృపనుఁగావుమయ్య • గోపకుమారా 30

శ్రీపానీపదభక్తుల
పాపములెడఁబాపఁబ్రతినఁ • బట్టితివికనా
పాపంబులపనయింపుము
గోపవధూచిత్తలోల • గోపకుమారా. 31

తలఁచెదపాదంబెన్నెప్పుడుఁ
బలికెదనీపేరుపాట • భక్తశరణ్యా
నలలితముగ నీపదములఁ
గొలిచెదననుఁ గావుమయ్య • గోపకుమారా. 32

ఏలితివి ముజ్జగంబులఁ
జాలితివి సమస్తశత్రు • జాలముఁదుంపన్
గ్రాలితివి కీర్తిచే భువిఁ
గ్రోలితివి యశోదపాలు • గోపకుమారా. 33

జలజభవాండములెల్లను
బాలుపొందగ బొజ్జలోనఁ • బూనియెటువలెన్
మెలఁగితివో వసుదేవుని
కులసతి గర్భమునసీవు • గోపకుమారా. 34

పాపాత్ముఁడజామిళుఁడు
నీపేరందనకుమారు • నింబిలువఁగదా
పాపిం చెనీపదంబులు
గోపీవస్త్రాపహరణ • గోపకుమారా. 35

ముచ్చిలితివిపాల్పెరుగులు
చెచ్చెరగోపాల! సతుల • చేలములెల్లన్
దెచ్చితివి లీలనొక్కట
కుచ్చిత జనహరణ కృష్ణ • గోపకుమారా. 36

గాంభీర్యవిజిత సాగర
జంభారిప్రముఖ దేవ ♦ సంచయరక్షా
కుంభీంద్రపాలనావన
కుంభజముఖవినుత దేవ ♦ గోపకుమారా. 37

రజనీచరాధములుఁ భువి
ద్విజులనుమునివరులసురల ♦ వేధింపంగా
భుజబలమునఁగూల్చితివిలఁ
గుజనులరక్కసులనెల్ల ♦ గోపకుమారా. 38

చాణూర మల్లముష్టిక
బాణాసుర ముఖ్యదుష్ట ♦ వర్గవిభిధురా!
వాణీశ జనక కాంచన
క్షోణీధర ధీరకృష్ణ ♦ గోపకుమారా॥ 39

నామానస మందునెపుడు
నీమృదుపద పల్లవముల ♦ నిల్పిభజింతున్
ప్రేమఁగదుర రక్షింపుము
కోమల నవనీరదాంగ ♦ గోపకుమారా॥ 40

కడుభక్తితోఁ గుచేలుఁడు
పిడికెఁడు పృథుకములునీకుఁ ♦ బ్రీతినొసంగన్
దడయక కృపనాతనికై
క్షుడు భాగ్యమొసంగితీవు ♦ గోపకుమారా॥ 41

అనయము నీసంకీర్తన
మునసల్పు నరుఁడుమిగుల ♦ మూర్ఖుండైనన్
గనుఁను యమలోకముఁగనుఁ
గొనఁడని చెప్పెదరుబుధులు ♦ గోపకుమారా॥ 42

సంతతము నీపదంబులు
మంతనమునఁ జింతసేయు ♦ మానవులకునొ
క్కింతయును బాపమంటదు
కుంతీసుత పక్షనంద ♦ గోపకుమారా॥ 43

నిండుకృపను పాండవులను
భండనమున జయమొసంగి ♦ పాలించితివా
ఖండలనుత బాల్యంబున
కొండను ధరియించినావు ♦ గోపకుమారా॥ 44

పారాశర్య నదీసుత
నారదరుక్మాంగదార్జు ♦ నప్తముఖమహా
ధీరులగు భాగవతులన్
గూరిమిదరిఁజేర్చినావు ♦ గోపకుమారా॥ 45

తలఁచిన నాతినామనమున
నిలువ్వము కృష్ణాయటంచు ♦ నినునేఁబిలువం
బలుకుము దృఢభక్తిగనినుఁ
గొలచెద సతతంబునంద ♦ గోపకుమారా॥ 46

వారిజహిత శశినేత్రా
వారణపతినుతచరిత్ర ♦ వనధరగాత్రా
క్షీరాబ్ధిజాకళత్రా
కూరిమి నన్నుఁగావుమంటి ♦ గోపకుమారా॥ 47

నీమాయఁ దెలియఁదరమే
తామరచూలికిని చంద్ర ♦ ధారికైనను
సామజపతి సంరక్షా
కోమలనీలాభ్రదేహ ♦ గోపకుమారా॥ 48

ఘనభక్తితోడ నినునే
మనమునఁ బూజింతునెపుడు ♦ మాధవకృపతో
నను నీపుత్రుని గతిఁ జే
కొని యభయ మొసంగుమయ్య ♦ గోపకుమారా॥ 49

శివుఁడన్న నునీవె కే
శవుఁడన్నను నీవెగాక ♦ జగతీస్థలిపై
లవమంత భేదమున్నదె?
కువలయహిత భానునేత్ర ♦ గోపకుమారా॥ 50

రక్షా నను రక్షింపఁగ
నిమ్మా నాకభయమిమ్మ ♦ డిభరాడ్వరదా
నమ్మితి నామనవిని గై
కొమ్మా మ్రొక్కెదనునిను ♦ గోపకుమారా॥ 51

రావేల నన్నుఁ బ్రోవఁగ
నీవేల బిరాననభయ ♦ మిందాఁ బ్రిదినుతా
నీవే తల్లివి దోడువు
గోవిందానందతనయ ♦ గోపకుమారా॥ 52

ప్రతిదినమును, నీఘనమ
స్మృతు లొనరించెదను, దేవ ♦ కీ ప్రియమొనరూ
ఢితమతి నన్నేలుహాకీ
ఈతుకముతో నెల్లప్రొద్దు ♦ గోపకుమారా॥ 53

హరినారాయణ కేశవ
వరదపరాత్పర మురారి ♦ వసజదళాక్షా
గిరిధర పురహర మిత్రా
గుణతరళ్ళవంబోధ్రుమయ్యా ♦ గోపకుమారా॥ 54

రామానుజ శ్రీమానస
ధామా యదువంశజలధి ♦ తారాధీశా
కామజనకసురవందిత
శ్యామలనవనీరదాంగ ♦ గోపకుమారా॥ 55

ఋత్తైన నీనామసుధన్
మత్తాటునంబవ్వళించి ♦ మహినొకగద్దన్
గుత్తముగఁజేసినాడవు
బిత్తరి నానప్పుగొన్న ♦ గోపకుమారా॥ 56

గంగాధర సన్నుత శ్రీ
రంగా శ్రీవత్సవక్ష ♦ రాజీవాక్షా
మంగళము లొసంగు భక్తుల
కొంగునబంగారమీవు గోపకుమారా॥ 57

గగనగమన! గిరిధర! సుర
వరసన్నుత దివ్యపాద ♦ వనజాక్ష! హరీ!
నరసఖ! కురుకులనాశన!
గురుతుగ నినుఁ గొలుతు నెపుడు ♦ గోపకుమారా॥ 58

రావయ్య బాలకృష్ణా
రావయ్య కృపాలవాల ♦ రాగుణజాలా
రావ య్యవేగ నన్నుఁజే
కొవయ్యా జాలమేల ♦ గోపకుమారా॥ 59

జున్నును దేనెయు శర్కర
మున్నగు తియ్యని పదార్థ ♦ ములుసరియగునే
చెన్నగు నీనామముతోఁ
గొన్నన విలుకొంగఁ గన్న ♦ గోపకుమారా॥ 60

మీనమవై సోమకునిన్
బూనిక తో(జంపి వేద ♦ పుంజము బ్రహ్మ
ధీనము(జేసితి వప్పుడు
గోనాకరమానవినుత ♦ గోపకుమారా॥ 61

మందర శైలము వీ(పున(
గందుక గతినెత్తి దేవ ♦ గణములకమృతం
బందగ(జేసితివౌర! ము
కుందా దంతీంద్రవరద ♦ గోపకుమారా॥ 62

సూకరరూపుడవగుచును(
బ్రాకటముగ హేమనేత్రు( ♦ బరిమార్చి ధరన్
నీకొమ్మున నిల్పి వట
గోకుల పరిపాలనంద ♦ గోపకుమారా॥ 63

నరకేసరి రూపంబున
దురితుడగు హిరణ్యకశిపు( ♦ కుసుమాడి ధరన్
రూఢ దత్పుతునేలిన
గురుపరాక్రమ చక్రహస్త ♦ గోపకుమారా॥ 64

వామనుఁడవగుచు బలినిస్
భూమిపదత్రయము వేడి ♦ భువనము లెల్లన్
శ్రీ మీఱ నాక్రమించిన
కోమల నీలాభ్రగాత్ర ♦ గోపకుమారా। 65

జమదగ్నికి సూనుఁడవై
క్రమమున ముయ్యేడుమార్లు ♦ రాజుల నెల్లన్
సమయించిన సత్కైరవ
కుముదాప్త భక్తవరద ♦ గోపకుమారా। 66

దశరథ రాముఁడవగుచును
దశముఖ ఘటకర్ణముఖ్య ♦ దనుజులననిలో
మశకములఁ బోలిచంపిన
కౌశలమతీ నందతనయ ♦ గోపకుమారా॥ 67

బలరామ కృష్ణులనగా
నిలలో నుదయించిఖలుల ♦ నేపడఁచిమహీ
వలయభరముడిపినావట
కులగిరి నిభధీర నంద ♦ గోపకుమారా॥ 68

భువి బుద్ధరూపమున ఖల
నివహామం బ్రిమార్చి మిగుల ♦ నీతిజ్ఞుల మ
క్షువత్తోడఁ బ్రోచినావట
కువలయ పరిపాల విజయ ♦ గోపకుమారా॥ 69

కలియుగమునఁ బాపాత్ములఁ
గలిగూపము నొందికూల్పఁగలవిక మీఁదన్
దలఁప నినుఁబొగడఁ దరమే!
కులగిరి నిభ ధైర్య కృష్ణ ♦ గోపకుమారా॥ 70

మామపయిఁ బడుకొనియా
మామను వధియింపఁజేసి ♦ మామనుఁజంపం
గా మహినిశీకుఁ జెల్లును
కోమల పదకమలయుగళ ♦ గోపకుమారా॥ 71

అత్తయగు మహీకాంతనుఁ
జిత్తములర కత్తగర్భఁ జేసితివిక నీ
నత్తయగు రాధవయసున్
గుత్తకుఁ గొంటివిగదయ్యా ♦ గోపకుమారా॥ 72

సత్రాజిత్తునకై సుర
ధాత్రీజముఁ దెచ్చితీవు ♦ ధాత్రీశ హిమవ
ద్ధాత్రీధర నిభధైర్య
గోత్రారి ప్రవరవినుత ♦ గోపకుమారా। 73

బాలుఁడవై యుండఁగ నిను
రోలను నీతల్లి కట్టె ♦ రోషమ్ముతోడన్
రోలీడ్చి కొంచు మద్దులఁ
గూలఁగఁ ద్రోచితివి యౌర! ♦ గోపకుమారా॥ 74

రంగా దానవ గర్వవి
భంగా కరుణాంతరంగ ♦ పతగతురంగా
గంగాధర నుతదాసుల
కొంగున బంగారమీవు ♦ గోపకుమారా॥ 75

ఆలింపు మయ్య నా మొఱఁ
బాలింపుము వేగ నన్నుఁ ♦ బద్మదళాక్షా
చాలింపుము చలమింకను
గోలలనానాథ వినుత ♦ గోపకుమారా॥ 76

ఓ వసుదేవ తనూభవ
యోవారిజ పత్ర నేత్ర ♦ యోశరివరదా
భావజ సమాన సుందర
గోవింద ముకుంద నంద ♦ గోపకుమారా॥ 77

సుత్రాముఁడు గర్వంబునఁ
జిత్రముగా ఱాళ్లవాన ♦ క్షితిఁగురిపింపన్
ఛత్రము గతి గోవర్ధన
గోత్రంబెత్తితివి నీవు ♦ గోపకుమారా॥ 78

ఫణిరాజ శయన దానవ
ఫణిసముదయ వైనతేయ ♦ ఫణిధరమిత్రా
ఫణి గర్వ హారణవిల స
ద్గుణరత్నాకర ముకుంద గోపకుమారా॥ 79

నందతనూభవ వందిత
బృందారక బృందశత్రు ♦ భీషణముని హృ
న్మందిర దీనసురద్రుమ
కుందముకుళవదన నంద ♦ గోపకుమారా॥ 80

వారి జరిపుధరమిత్రా
వారిధర సమానగాత్ర ♦ వనరుహనేత్రా
వారిజ భవనుత పాత్రా
కోరిభజించెదను నిన్ను ♦ గోపకుమారా॥ 81

నీపుత్రకుండ నంటిని
కోపము నామీఁదఁబూనఁ ♦ గూడదటంటిన్
కాపాడవమంటిఁ గృపతో
గోపీజన పంచబాణ ♦ గోపకుమారా॥ 82

ఎంచగ నీసాటియె? య
క్కాంచన గర్భాద్రిపతి ♦ కానాధులు, హే
పంచశరజనక! నన్నున్
గొంచక రక్షింపరమ్మ ♦ గోపకుమారా॥ 83

సంతతమును తావకపద
చింతన సేయుచునటన్నఁ ♦ జిత్తమునాకో
క్రింతయుఁ దిరముగనుండదు
కుంతీసుతపాల కృష్ణ ♦ గోపకుమారా॥ 84

నిజభక్తి నిశ్చఁగొలచెద
సుజనులతోఁ జెలిమిసేతు ♦ సుస్థిరమతినై
భజియించెదనిను సతతము
కుజనవిదూరా ముకుంద ♦ గోపకుమారా॥ 85

భువినీమాయ నెరుంగన్
భవుఁడు సమర్థుండుగాఁడు ♦ పరులకు వశమే?
రవికోటితేజ నిను ని
ధ్రువభక్తిఁ దలంతునెప్పుడు ♦ గోపకుమారా॥ 86

నిబ్బరముగఁ బూతనచను
గుబ్బలఁ గబళించిపాలు ♦ గ్రోలెడుమిషచే
నబ్బగముగఁ దత్ప్రాణముఁ
గొబ్బునఁ బీల్చితివియారా! ♦ గోపకుమారా॥ 87

నీపాదపంకజంబులు
ప్రాపుగ మదినమ్మినాఁడ ♦ పద్మనయన నా
పాపంబులెల్లఁ బాపుము
గోపవనఘాశంభరారి ♦ గోపకుమారా॥ 88

వారణ రిపువిభవిక్రిం
వారణపతిరక్ష దనుజ ♦ వారణసింహా
దూరీకృతాఘ సంచయ
కోరికలొసఁగూర్చిబ్రోవు ♦ గోపకుమారా॥ 89

సంతతముభక్తి నినునా
స్వాంతమున నిల్పిగొలుతు ♦ సరసిజనేత్రా
వంతలుడిపి రక్షింపుము
కుంతీసుత వరదనంద ♦ గోపకుమారా॥ 90

అనుదినమును నిను హృన్మన
మున నిల్పిభజింతు మోద ♦ మున వనజాక్షా
కనికరముఁబూని ననుసర
గునఁ గావఁగదయ్య తండ్రి ♦ గోపకుమారా॥ 91

నేపాపవర్తనుఁడనని
కాపట్యుఁడనుచు మిగుల ♦ గర్వపటించుచున్
గాపాడకుంట న్యాయమె ?
కోపము నీకుండజనునె ? ♦ గోపకుమారా॥ 92

తనయులు తప్పొనరించిన
జనకులు సైరించిబ్రోవ • జగతినిధర్మం
బనఘా తనయుల సైఁ బగఁ
గాని ప్రోవకయునికిఁదగునె? • గోపకుమారా॥ 93

భవభయహార భవపీరజ
భవసురపతివినుతపాద • పంకజయుగళా
సవినయముగ మ్రొక్కెద మ
న్నావనముఁ గాపాడుమెప్పుడు • గోపకుమారా॥ 94

భావజజనకా యదుకుల
పావన జగదేకవీర • భవ్యవిచారా
దేవస్తుత పాదాంబుజ
గోవర్ధన శైలధరణ • గోపకుమారా॥ 95

బృందావన సంచారా
బృందారకపతినుతా • బృందశరీరా
మందరభూధరధీరా
కుందేందు సమానకీర్తి • గోపకుమారా॥ 96

నిర్మదుల నిర్వికారుల
నిర్మోహుల నిరతిశయుల ♦ నిశ్చలమతులన్
నిర్మల భక్తులనెప్పుడు
కూర్మి నిజార్తిచెడవు నీవు. ♦ గో పకుమారా॥ 97

వాణీశ మఘవముఖ గీ
ర్వాణస్తుత దివ్యపాద ♦ వనజాతినత
త్రాణ సరోరుహ నేత్రా
క్షోణీసుర సంఘరక్ష ♦ గోపకుమారా॥ 98

యదుకుల సాగరచంద్రా
మదనజనక సదయ హృదయ ♦ మదరిపుజైత్రా
వదలక సతతమునిలువుము
కుదురుగ నాహృదయమందు ♦ గోపకుమారా॥ 99

హాటక భూధర ధీరా
హాటక గిరిచాపవినుత ♦ హాటకవసనా
హాటకరుక్మాంగద నేఁ
గోటినమస్కృతులొనర్తు ♦ గోపకుమారా॥ 100

దుర్మదము విడిచి సతతము
నిర్మల భావంబుతోడ ♦ నినుసేవింపన్
కర్మలు తెగునని వింటిని
కూర్మినిదరిజేర్పు నన్ను ♦ గోపకుమారా॥ 101

కాటక కేతన జనకా
పాటీరాగరు విలిప్త ♦ భాసురవక్షా
హాటకదివ్యాంబర మణి
కోటీరాంగదవిభూష ♦ గోపకుమారా॥ 202

కంఠీరవవిక్రమ శ్రీ
కంఠస్తుతపాత్రి నీల ♦ ఘననిభగాత్రా
కంఠకలితకౌస్తుభ వై
కుంఠపురాగార నంద ♦ గోపకుమారా॥ 103

రవికోటితేజవిను మిక
సవినయముగ యాజ్ఞవల్క్య ♦ శాఖోద్భవుఁడన్
కవితాకన్య నొసంగితిఁ
కువలయ పరిపాలనీకు ♦ గోపకుమారా॥ 104

క్షితిగంగ రాజనామా
న్వితుఁడన్ ప్రిహారాజు వంశ • నీరధిభవుఁడన్
శతకము నీకర్పించితిఁ
గుతుకమునఁ బరిగ్రహింపు • గోపకుమారా॥ 105

ఒప్పుగ నీకొనఁ గితిఁ గను
మప్పాగై కొనుము కంద • హారంబిది నా
తప్పులు మన్నింపుము నిను
గొప్పగఁ బూజింతు నెపుడు • గోపకుమారా॥ 106

నతిఁ జేసెద లోకేశా
నతిఁ జేసెద పరమపురుష • నతిఁజేసెద నా
గతి నీవేయని నమ్మెదఁ
గుతుకముతో నెల్లప్రొద్దు • గోపకుమారా॥ 106

వందనము భక్తవత్సల
వందనము పురందరాది • వందితచరణా
వందనము దీనపోష ము
కుందా కరుణాంతరంగ • గోపకుమారా॥ 108

## —: సమాప్తము. :—

శాలివాహన శకపు, వ ♦ త్సరములందు
శైల పుర హస్తి చంద్రుల ♦ సంఖ్యలోన
చైత్రశుద్ధసప్తమి నాడు ♦ శతకమన్నచు
గంగరాజు కవి రచించె ♦ ఘనులువొగడ॥



# షట్పాద సీసము.



శ్రీ విష్ణునాభిరా ♦ జీవసంభవులలో
బ్రహ్మరాతసుతుండు ♦ భక్తితోడ
సూర్యదేవుని చెంత ♦ శుక్ల యజుర్వేద
మభ్యసించె నతండు ♦ యాజ్ఞవల్క్యుఁ
డతని శిష్యులలోన ♦ నధికుఁడై విలసిల్లి
జమదగ్నిసుతుఁడవ్వ ♦ జగతినెల్ల
దానంబుగాఁ గొన్న ♦ మౌనిగోత్రంబున
జన్మించె మూర్తి పీ ♦ సా:వంశ
జలధిచంద్రుఁడనంగ ♦ జగ్గప్పయతనికి
సుతుఁడు రామస్వామి ♦ సుగుణసాంద్రుఁ
డవనీసుతనుఁ బోలు ♦ నట్టి వేంకటసీత
మాంబసమేతుఁడై ♦ యశముఁగాంచె

గీ॥ నామహానీయుఁ డిదిగాంచి ♦ యాదరించి
యచ్చువేయించి ప్రకటించె ♦ సమ్మతముగ
నంద తనయుఁడు వాడి,కా ♦ సంత మొసఁగి
భూరికృపతోడ, సతతంబుఁ బ్రోచుఁ గాత॥



